

# 14. ఫీల్ఖానా లక్ష్మణ దేశికులు (1846-1914)

రామడుగు శివరామదీక్షితులు ఆంధ్రదేశంలో స్థాపించిన అచలమతం అచిర కాలంలో మూడుపూవులారుకాయలుగా వర్ధిల్లినది. శివరామ దీక్షితుల తరువాత ఆయన శిష్యుడు కర్నూలు జిల్లా కంబాలూరి అప్పమంత్రి, ఆయన శిష్యులు ఎఱ్ఱగొండ పాలెం పరశురామ సీతారామస్వామి, పరశురామ నరసింహస్వామి సోదరులు (కౌండిన్యస గోత్రం) వారి శిష్యుడు భాగవతులకృష్ణప్రభువు (1823-1876) అచలమతాన్ని బహుళ వ్యాప్తి చేసినారు. ఆ మతానికి కావలసిన భక్తివేదాంతవాఙ్మయం సృష్టించినారు. భాగవతుల కృష్ణప్రభువు గొప్ప హరిదాసు. సహజకవి. తమ కవితాకళద్వారా అచల మతానికి ప్రకరణ గ్రంథములనదగిన రచనలు చేసినారు. భాగవతులకృష్ణ ప్రభువువద్ద దీక్షితులైన శిష్యులు పెక్కురు. వారిలో హైదరాబాదు సికిందరాబాదు నగరాల్లో అచల మతానికి గొప్పపట్టు సంపాదించినవారు పీల్ఖానా ఇంటిపేరుగల శ్రీవత్సగోత్రీకులైన నరసింహారావు, సికింద్రాబాదు బేగంపేట కరణం. ఆయన భార్య రామమ్మ. వీరు శాక్తేయులు. వీరి తొలి ఇంటిపేరు కొత్తపేటవారు. హైదరాబాదులో మొదట పీల్ఖానాలో ఉండి తరువాత బేగంపేటకు మారటంచేత పీల్ఖానా ఇంటిపేరైనది. సంపన్నులైన ఈ

నియోగి దంపతులసంతానం లక్ష్మణరావు, గిరెమ్మ, రాధమ్మ, శంకరరావు, రామారావులు. ఇందులో జ్యేష్ఠులైన లక్ష్మణరావు మన కథానాయకులు. లక్ష్మణరావు జననం శా.శ౧౭౬౮ పరాభవ సం॥ శ్రావణ బహుళద్వాదశి మంగళవారం క్రీ.శ 18-8-1846. లక్ష్మణరావు సోదరులు పీల్ఖానా శంకరప్రభువులగూర్చి (1855-1897) ఆంధ్రయోగులు 3వభాగంలో వ్రాసినాను.

లక్ష్మణరావుగారు లౌకికపారలౌకికవిద్యల పారమందిన పండితుడు. సత్త్వ సంపన్నుడు. ఆయన మిగతా తోబుట్టువులకంటె విలక్షణమైనవాడు, ఆ జన్మబ్రహ్మచారి. శంకరరావు గృహస్థు. అన్నగారివలె ఆధ్యాత్మికచింతన గలవాడు. కనుక ఇరువు రన్నదమ్ములు తండ్రిగారి కరణీకం బాధ్యతను చిన్నతమ్ముడు రామారావుకు అప్పగించి ఆధ్యాత్మప్రచారానికి నడుంకట్టినారు. శంకరరావు హైదరాబాద్ ఫీల్ఖానా (నాంపల్లి)లో ఉండేవాడు. లక్ష్మణరావు చిన్నతమ్ముడు రామారావుతో బేగంపేటలో ఉండేవాడు.

లక్ష్మణరావు శంకరరావు సోదరులు తొలుత సిద్ధేశ్వర గురువులను ఆశ్రయించి పంచాక్షరీ మంత్రదీక్షితులై మంత్రసిద్ధి పొందినారు. అటుతరువాత అచలమార్గ ప్రవర్తకులైన భాగవతుల కృష్ణప్రభువును ఆశ్రయించినారు. ఆకాలంలో కృష్ణదేశికులు హైద్రాబాదు నగరం మహారాజ్‌గంజ్‌లో తల్లావఝుల జాలమ్మ ఇంట్లో ఉండేవారు. కృష్ణదేశికులు ముందుగా జాలమాంబకు దీక్ష ఇచ్చినారు. అటుతరువాత ఫీల్ఖానా లక్ష్మణరావు, శంకరరావు సోదరులకు, బాగ్ అంబర్‌పేట మంగోలు వెంకటనర్సయా చారికి దీక్ష ఇచ్చినారు. లక్ష్మణరావు శంకరరావు సోదరులు కృష్ణదేశికులకు చతుర్విధ శుశ్రూషలు చేసి వారి అనుగ్రహానికి పాత్రులై గురుత్వాధికారం పొందినారు. యోగారూఢులైన ఆ ఇరువురు సోదరులకు అనేకసిద్ధు లలవడినవి. కాని శంకరరావుగారి వలె లక్ష్మణరావు మహిమలు ప్రదర్శించలేదు. తమ్మునిగూడ మహిమలు ప్రదర్శించ వద్దని హితముపదేశించినారు. శంకరరావుగారికివలె లక్ష్మణదేశికుల శిష్యవర్గం

బహుళం. అందులో ముఖ్యులు 1. దీక్షిత్ తులారాం ప్రసాద్ 2. పగడాల వెంకటేశ్వర సచ్చిదానందస్వామి(చిత్తూరు) 3. కాగితాలగూడెం రామన్న, 4. ఇబ్రహీంపట్నం వెంకన్న, 5. గూటాల వీరన్న, 6. సింగంచెట్టి చినరామలింగం, 7. తాడ్వాయి భద్రంరాజు కిషన్‌రావు, 8. తాడ్వాయి నిమిషకవి రాజారాం, 9. కుచ్చుల వెంకటస్వామి నాయుదు, 10. పసుపులేటి రామస్వామినాయుడు, 11. బి. రుద్రమూర్తి నాయుడు, 12. కుంకుమ మల్లయ్య, 13. కొండోజు సీతయార్య, 14. సూర్యాపేట కొమరగిరి లక్ష్మీనారాయణ ప్రభువు, 15. బంగ్లా బాలయ్య వంటి ప్రముఖులు 50 మందికిపైన శ్రీవారివద్ద దీక్షలు తీసుకున్నారు. లక్ష్మణప్రభువుల గురుభక్తి ఎంత గొప్పదో వారి శిష్యవాత్సల్యం అంతగొప్పది. లక్ష్మణ ప్రభువులే మొదటిసారి శివరామ దీక్షితుల అచలగురు మందిరం అటుతరువాత తమ గురువులు భాగవతుల కృష్ణప్రభువుల సమాధిమందిరం బేగంపేటలో నిర్మించినారు. తమకంటె ముందే దేహం చాలించిన తమ్ముడు శంకరప్రభువుల సమాధి మందిరంకూడ బేగంపేటలో నిలిపినారు. లక్ష్మణ ప్రభువులు శా. శ౧౮౩౫ ప్రమాదీచ సం॥ పుష్యబహుళ ఏకాదశి గురువారం రాత్రి 10 గంటలకు (22-1-1914) విదేహకైవల్యం పొందినారు. వారి శిష్యులు శ్రీవారి సమాధిమందిరాన్ని వారి గురువుల సమాధి వద్ద నిలిపినారు. కాలాంతరాన బేగంపేట విమానాశ్రయ నిర్మాణసమయంలో ఈ సమాధులన్నీ నేలమట్టమైనవి. ప్రభుత్వంవారు బేగంపేటలోని ఆ స్థలాలకిచ్చిన నష్టపరిహారం ధనంతో వారి శిష్యులు సితాఫల్‌మండీలో స్థలంకొని శ్రీమత్ ఫీల్ఖానా లక్ష్మణదేశికప్రభువుల అచల గురుమందిరం ఏర్పాటు చేసినారు. ప్రస్తుతం దీని అధ్యక్షులు ఉప్పలంచి కృష్ణమూర్తిగారు.

లక్ష్మణదేశికుల రచనలు 1. సుబోధరత్నమాల, 2. అచలతత్త్వశిరోమణి అఖండమాల 3. సుజ్ఞానాతీతార్థ తత్త్వఖండమాల. లక్ష్మణదేశికుల నిర్యాణానంతరం వారి తమ్ముడు రామారావు ప్రేరణతో శ్రీవారి రచనలు చీకోటి వీరన్నఅండ్ సన్స్

సుబోధ ముద్రాక్షర శాలలో 1914 ఆగస్టులో మొదటిసారి అచ్చైనవి.

లక్ష్మణదేశికులు తొలుత పంచాక్షరీ మంత్రసిద్ధులై అటుతరువాత అచల మార్గాను యాయులైనారనుటకు వారు రచించిన ఈ తత్త్వము సాక్ష్యము.

ఓం నమశ్శివాయ యను మంత్రము ఒప్పదగినదే ఓ మనసా
కానలేక ఈ మానవాధములు కల్లని పల్కిరే ఓ మనసా॥

జ్ఞానము గలవారలు ఈ మంత్రము ఘనమని యెన్నిరె ఓ మనసా
ప్రాణపదంబగు శివపంచాక్షరి పఠనశాయవే ఓ మనసా॥ ఓం

బొమల మధ్యమున వెలిగెటి కళలను క్రమముతొ నెరుగవె ఓ మనసా
కమలభవుడు ఇంద్రాదిమౌనులును కడతేరినరట ఓ మనసా॥ ఓం

తపసులు యోగులు పరమహంసలును జపవ్రతములు సల్పిరె మనసా
చపలతలుడిగియు శ్రీగురువర్యుని చెంత జేరవే ఓ మనసా॥ ఓం

ప్రథమగురుడు సిద్ధేశ్వరుడనువా రుపమచే బోధించిరె మనసా
వ్యధలులేని ఆనందవార్ధిలో సతతము గ్రుంకితి ఓ మనసా ॥ ఓం

కారణరూపము దాల్చినవారలు భాగవతుల కృష్ణుడె మనసా
నేరములెన్నక ధారుణిలో మన కోరిక లీడెర్చు నె ఓ మనసా ॥ ఓం

ద్వాదశిశోడషి ద్వయమంత్రంబులు బోధపరచెనే ఓ మనసా
లేదులేదు జన్మము లక్ష్మణయని వాదము దొలగించిరె మనసా ॥ఓం

సుజ్ఞానాతీత తత్త్వఖండమాల

## గురు సూచనతత్త్వము

చూడరా ఈ బ్రహ్మమూ ఎడతెగకయున్నది- యేద జూచిన బ్రహ్మమూ
చూడరా యీ బ్రహ్మమెప్పుడు-జోడు లేకను నామరూపము నాడు నేడనరాక
నిరతము గూఢముగ గురు రూపమైనది ॥చూ॥

జనక శుక సాందీప కృష్ణులు అనువుగా అర్జునుడు మొదలగు
ఘనులు మౌనులు ఋషులు యోగులు సనకనారదులెన్న దగినది ॥చూ॥

శ్రీధరుడు శివరామదీక్షితులాదిగా గల అప్పబ్రహ్మము
ముదముతో శ్రీ పరశురామమూర్తి దేశికవరులు గన్నది ॥చూ॥

ధరణిలో భాగవత కృష్ణుడు పరమపదమును అతని చేగని
సరగునను విను లక్ష్మణాఖ్యా తిరిగి జన్మము రానెరాదని ॥చూ॥

ఆధారం :

1. శ్రీమత్ పీల్ఖానా లక్ష్మణదేశిక అచలగురుమందిరం సీతాఫల్‌మండి, సికింద్రాబాదు, 500061.
అధ్యక్షులు. సమష్టి బోధానంద ఉప్పలంచి కృష్ణమూర్తి అందించిన సమాచారం.